టుల యొక్కయు కోశులయొక్కయు శాసనములు ను సంఖ్యాకములు కాగలవు. సంస్థాన గ్రామములం దేను గద్వాలలో నాపూర్వమున కవిశాల పండితు డొకడు కాని పోరుడు లేదని వినికి. ఎన్ని యపూర్వ గ్రంథరాజములీ సంస్థాన చ్ఛాయనున్నవో విచారింపవలసి యున్నది. మేము స్వతంత్ర గ్రంథ రచనాదికమున వ్యగ్రులమై యున్నారము. విశ్రాంతి లభించినచో రాబోవు వేసవిలో గద్వాల సంస్థానాశ్రయమును బురస్కరించి కొని యీ సంవత్సరము పరిశోధనము జరుప వలయునని యుత్సాహము గలదు.

గద్వాల సంస్థానాధిపతియగు సోమనాద్రి ప్రభువు పితృత్వమున కార్తవీర్యార్జునునకు బరశురామునకు నన్ని విధముల సమానుడు. ఈ మహామహుని జీవితము శారదకాంత్రము సాడుచున్నారు. ఆంధ్రపీఠి యు రెండవ భాగములో మేమిప్పటికి జీవితము సంగ్రహించి వ్రాసియున్నారము. ఇన్ని విషయముల నాంధ్రదేశమునకు ఆంధ్రభాషకు ఆంధ్ర జాతియునకు ఆంధ్రజాతీయతకు సంబంధించిన గద్వాల సంస్థానము ఆదిలక్ష్మీదేవి యనదగు ఆదిలక్ష్మీదేవి సాక్షిగాన ప్రసిద్ధమగుట యాంధ్రుల సుకృత విశేషమని మాతలంపు. దౌరతన మునాడు గద్వాల సంస్థానము రాణీగారికి స్వాధీనము చేసిన దినము ఆంధ్రులందఱకు పండుగ. శక్తిగల్గిన ఆ దినమున ప్రతి సంవత్సరము పండుగ జేసి కృతజ్ఞత తెలుపుట మనవిధి.

## దేశాభ్యుదయము

పి. సూర్యనారాయణ శాస్త్రిగారు

"యస్యాస్తి విత్తం సనరః కులీనః
సపండితస్సశ్రుతవాన్ గుణజ్ఞః
సఏవవక్తా సచదర్శనీయః సర్వేగుణాః
కాంచనమాశ్రయంతి. భర్తృహరి"

"ధనమూలమిదం జగత్" అను నది గొప్పయార్థిక శాస్త్రవేత్త కొలచిన యమూల్యార్థిక సిద్ధాంతము ఏలయన సమస్త ప్రాపంచిక వ్యవహారములకును ధనము మొదటి యవసరము. ధనములేక యేపనియైన దలపెట్టుట కు వ్యర్థమగును. ముందు ధనసాహాయ్యము వలసినంత యుండిననే గాని యితరాంగములు సమకూరవు. సఃలైహిక కార్యసిద్ధియు ధనము వలన గలుగుట నయ్యదియే తజ్జీవనమున నేకుండుటకన్న ప్రాధాన్యము నొందినది. ఏ సత్కార్యము జరిగిననే యుపాకార్యము జరుగ సాధనములేక జరుగజాలదు. సాంఘిక నైతిక, విద్యా, వైజ్ఞానిక, పారిశ్రామిక రాజకీయాభివృద్ధి గాని మఱెట్టి యభివృద్ధిగాని ధనాభావమున నెరవేరుట దుర్లభమని చెప్పవచ్చును. ఇంతయేల సకల జాతి ప్రజాభివృద్ధి ధనముపై నాధారపడి యున్నది.

ఒకానొక సంఘముగాని జాతిగాని రాష్ట్రము గాని దేశముగాని ఖండముగాని యభివృద్ధిగాంచుచున్నదని గాని పొందినదని గాని యనిన వెంటనే యద్దాని యార్థికస్థితి యొక్క సంపూర్ణ సమృద్ధి మభివృద్ధిగాంచబడు చున్నదని గ్రహింపవచ్చును. ఏలయన నార్థికస్థితి సంతృప్తికరముగా నుండిన సర్వాంగపుష్టియు గలుగును. ప్రతిసంస్థయు, ప్రతిసంఘము సమస్థితిబొంది దేశమున బోటీ యన్యోన్య వైరుధ్యములేక శాంతము నెలకొనును. దేహమునకు రక్తమెట్టులనో దేశమున కార్థికమట్టులే. దేహము పుష్టికరముగను కాంతివంతముగ నారోగ్యముగ నుండుటకు రక్తమెట్టుల హేరాళముగ గావలయునో జాతిబలిష్ఠ మగుటకును వికాసమును బొందుటకును నన్యజాతీయులతోడి సమానగౌరవ ప్రతిపత్తుల బొందుటకును, స్వాతంత్ర్యము ననుభవింప శక్తి బొందగలుగుటకును, దేశమున బ్రతిప్రయత్నము నెరవేరుటకు, దృష్టియు శాంతియు నిలిచియుండుటకును బ్రజలు సురక్షితులయి సుఖులయి యుండుటకు నార్థికాభివృద్ధి యవసరము. రక్తములేనిచో దేహము నిర్జీవమగును, తక్కువైనచో గళితప్రాయమై రోగములకాశ్రయమగును. దేహమునుండి రక్తము క్రమముగా నేదేని ద్వారమున బ్రవహించి పోవుచుండిన స్మృతి తప్పి జీవితాశ వీడిపోవును. అటులనే దేశమున ధనమే




## స్కీను కమిటీ

స్కీనుకమిటీ నివేదిక విషయమున భారత ప్రభుత్వమువారి చర్యను ఖండించుచు జిన్నాగారు ప్రతిపాదించిన తీర్మానము ౪౧ మంది ప్రతికూలురుగను, ౬౦ మంది అనుకూలురుగను నెగ్గెను. గత నాలుగైదు వత్సరములలో ఇటువంటి ముఖ్యమైన విషయములందు ప్రభుత్వమువారి కెన్నడును నేటి దుస్సహ పరాభవము కలుగలేదు. ఈ పరాజయము, భారత ప్రభుత్వము వారెంతవరకు దేశీయుల అభిమానాదరములకు పాత్రులో, సైమను ప్రభృతులకు వెల్లడిచేయ గలదు.

స్కీనుకమిటీ నివేదికపై ప్రభుత్వము వారు చేసిన తీర్మానములు, తమ మిత్రుల హృదయములలో మినుకు మినుకు మనుచున్న తుది యాశలను అంత మొందించెను. వారిసదుద్దేశములందుగలవిశ్వాసమువిచ్ఛిన్నమైపోయెను. సర్ అబ్దుల్ కయ్యూమ్, రాజా గుజ్నఫర్ అలీఖానవంటి విశుద్ధ ప్రభుత్వ పక్షపాతులు గూడ నీవిషయమున దొరతనము వారిని ఖండింపవలసి వచ్చెను. గంభీరాశయులౌ, సేత్నా, జిన్నాగార్లు స్కీను కమిటీలో జేరి ౧౮ నెలలు కృషిసలిపిరి. కమిటీ సూచనలన్నిటిని బ్రిటిషువారామోదింతురని నచ్చజెప్పుటచే భారతీయ సభ్యులు, తమ యాశయముల కొన్నిటిని వెనుకకు ద్రోసి, ఏకగ్రీవ నివేదిక సమర్పించుట కొప్పుకొనిరి. కాని యిప్పుడా నివేదికలో కోరబడిన కనీసపు కోరికలను గూడ ప్రభుత్వము వారు నిరాకరించు చున్నారు. వీనివలన వారికృషి వ్యర్థమయ్యెను. వారిఆశలు విఫలమయ్యెను.

భారతదేశపు సైన్య సమస్య నిన్న మొన్నటిది కాదు. నేటికి ౭ సంవత్సరముల నుండి దానిని గూర్చి చర్చ జరుగుచునే యున్నది. ౧౯౨౧లో భారత దేశమున కొక సైనిక కళాశాల యవసరమని శాసనసభలో తీర్మానము జరిగెను. ఆర్థికవసతి చేకూరిన వెంటనే దానిని నెలకొల్పుదుమని ప్రభుత్వము వారంగీకరించిరి. కాని రెండేండ్లవరకేమియు చేయరైరి. అందుచే ౧౯౨౩న ఈవిషయము మఱల చర్చకు వచ్చెను. అప్పుడు సైనిక కార్యదర్శిగానున్న బర్డనుగారు కళాశాల గూర్చి విచారింప నొక యుపసంఘము నియమింప వలెనను సవరణ నుపపాదించిరి. అది ఆమోదింప బడెను. కాని మరల ౨ సంవత్సరముల వరకు ప్రభుత్వమువారు నిదురపోయిరి. అంత ౧౯౨౫ సంవత్సరమున వెంకటపతి రాజుగారి సమస్యను మఱలముందఱికీడ్చిరి. శాసనసభ ఒత్తిడి వలన సభానాయకుడగు సర్ అలెగ్జాండరు ముడ్డిమానుగారు స్కీను కమిటీని నియోగించిరి. ఈ కమిటీ వారు సంవత్సరమునకు పైని కృషిసలిపి, ఆశియా, యూరపు, అమెరికా ఖండములలో వాఙ్మూలములనుగొని, కొన్ని లక్షల రూపాయలు వెచ్చించి, నొక నివేదికను తయారు జేసిరి. అందు ముఖ్యముగా మూడు సూచనలు చేయబడెను. మొదటిది భారతదేశమున ౧౯౩౩వ సం॥ లోపల నొక సైనికకళాశాల స్థాపించవలెను. రెండవది నేడు భారతీయులకై ప్రత్యేకింపబడిన ఎనిమిది పటాలముల ఏర్పాటును తీసివేయ వలెను. మూడవది ౧౯౨౮ నుండి ౧౯౫౨ లోపల అనగా ౨౫ యేండ్లలో, భారత సైన్యమునందు నూటికి ౫౦ వంతున భారతీయోద్యోగులుండవలెను. భారతీయులకు లాభముగూర్చు సూచనలివి. వీనితోబాటు, సైన్యమునందు కొందఱు బ్రిటిషు ఉద్యోగులు తప్పక యుండవలెననియు, సైన్యముయొక్క పటుత్వము తగ్గకూడదనియు, కొన్ని బ్రిటిషు వారి కనుకూలములగు సూచనలుకూడ గలవు.

కాని ప్రభుత్వమువారు నేడు చేయుచున్నదేమి? తంత్రముచే నివేదికలోని ముఖ్యములగు సిఫార్సులను రద్దు పఱచుచున్నారు. ఇంగ్లండులోని శిక్షణ, ఎక్కువ ప్రయోజనకరమని భారత కళాశాల నిర్మాణము వెనుకకు నెట్టిరి. ఎనిమిది పటాలముల విధానము యుక్తమైనదనియు, లాభకారియనియు బలికి రెండవ దానిని త్రోసివేసిరి. సైన్యము నతిశీఘ్రముగ భారతీయుల పరమొనరించిన హానికరమగునెడి శుష్కవాదముతో మూడవ సిఫార్సును నిరసించిరి. ఇక మనకు మిగిలిన దేమి? ఆత్మగౌరవమునకు భంగకరమగు ౮ పటాలముల కొలువు, బ్రిటిషు ఉద్యోగుల అధికారము, ౫౫ కోట్ల రూపాయల సైనిక వ్యయము.

బ్రిటిషు కమిటీవారు భారతీయుల హక్కులను సుముఖతతో విచారించుటే లేదు. అట్లెన్నడేని జరిగినచో, కమిటీ సిఫార్సులను ప్రభుత్వమువారు ఉల్లంఘించుట తప్పని సరియై యున్నది. ౧౯౦౦ సం॥ నాటి కర్జన్ కమిషను, ౧౯౨౩ నాటి ఇండస్ట్రియల్ కమిషను, ౧౯౧౮ నాటి మాంటేగు చెల్మ్స్ఫోర్డు రిపోర్టు సందర్భమున జరిగిన దిదియే. నేడు స్కీను కమిటీ నివేదికకు కూడ నీగతియే పట్టినది. ఈ కమిటీల నియోజనము వట్టిబూటకమే. వృథాప్రయాసము అర్థవ్యయము తప్ప, వీనివలన దేశమునకు గలుగగల లాభమెద్దియు కానరాదు. భారతీయులేదేని సంస్కరణమునకై ఆందోళన సలిపినచో దానిని శాంతిపఱచుటకు, కాలహరణమునకు ఒక కమీషను నియోగింతురు. ఈమధ్య తామేమి చేయవలెనో నిర్ధారణ జేసికొందురు. కమిషను ఒకటి రెండేండ్ల తరువాత నివేదిక సమర్పించుతఱి, పరిస్థితు లనుకూలముగ నున్నచో దానిని పూర్తిగ నుపేక్షింతురు. లేనిచో అందులో నిఱెండు మూడు సిఫార్సులనో మన ముఖము తుడుచుటకై నమలు జరుపుదురు. మొత్తముమీద టక్కరితనము మాని సహృదయముతో నెన్నడు ప్రవర్తించి యెఱుగరు. చేయదలచినది తాము మొట్టమొదటనే నిశ్చయించుకొందురు. కమిషను, నియామకము దాని విచారణ, వాఙ్మూలముల సేకరణము, నివేదిక, యివన్నియు వట్టిబాహ్యాడంబరము కొఱకు. స్కీను కమిటీ విషయమున గూడనిదియే జరిగినది. ఈకమిటీ ఉప సంఘము ఇంగ్లాండుకు పోయినపుడు, అచట బ్రిటిషు సంగ్రామకళాశాలయము వారు చేసిన సూచనలు నేడు ప్రభుత్వము వారు చేసినవేయని జిన్నాగారిసాక్ష్యము. అట్టితఱి ఈ కమిటీని నియోగింపకున్న భారత దేశమునకు కొంత రొక్కమైన మిగిలి యుండెడిది.

కమిటీవారి సూచనలు ఎగరగొట్టుటకు సైన్యాధిపతిగారు సూచించిన కారణములు వట్టి కుయుక్తులు. భారత సైనిక కళాశాలలోగూడ, ప్రప్రథమమున సుప్రసిద్ధ బ్రిటిషు సేనానులే అధ్యాపకులుగా నుందురు. అట్టిచో

REG. No. N. 45.

REG. No. M. 2185

గోలకొండ పత్రిక.

ట్రూపుబజారు హైదరాబాదు, దక్కన్.

సంవత్సరము చందా రు. ౭-౦-౦

అర్ధసంవత్సరము ,, ,, ౩-౧౨-౦

విడి ప్రతిక ౦-౧-౮

శ్రీయుత

STAMP.

Printed and Published by K. Balakrishna Reddy at the Golkonda Press, Troop Bazaar, Hyderabad Dn.